# కాకతీయరాజులచరిత్ర

## (పద్యకావ్యము)


గ్రంథకర్త:

'విమర్శకాగ్రేసర'

**కొత్త భావయ్యచౌదరి**

దేశరహస్యాలు, కమ్మవారిచరిత్ర, రెడ్లచరిత్ర, కాశ్మీరదేశచరిత్ర, కల్పవల్లి,
సగర పట్టాభిషేక నాటకాది రచయిత.

సంగంజాగర్లమూడి

గుంటూరుజిల్లా



1955

వెల రు. 0-8-0

# తొలి పలుకు

కర్త: శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మగారు, యం. ఏ.

(గుంటూరు హిందూకాలేజీ ఓరియంటల్ భాషాశాఖాధ్యక్షులును, ఆంధ్ర యూనివర్సిటీ సినేటు, అకడమిక్కు కౌన్సిలుల మెంబరును.)

మిత్రమహాశయులు శ్రీ కొత్త భావయ్యా చౌదరిగారు "కాకతీయరాజుల చరిత్ర" అను పద్యకావ్యమును ఇటీవల రచియించి నన్ను తొలిపలుకు వ్రాయ నాదేశించినారు. ఇందుకు శ్రీ చౌదరిగారికి నాయందుగల అభిమానమే ముఖ్య కారణమని భావించి ఈ పనికి పూనుకొనినాను. విషయము ఆంధ్రదేశమును పరిపాలించిన స్వతంత్ర రాజవంశములలో నుత్తమోత్తములైనవారి చరిత్ర. కవి అనితర ఐతిహాసిక సాధ్యమయిన సమగ్రచరిత్ర నిర్మాణదక్షతయును సరస మగు కావ్యసృజనశక్తియు డక్కఁగొన్నవ్యక్తి.

కాకతీయులు, ప్రప్రథమముగ ఏకచ్ఛత్రాధిపత్యమునకు విశాలాంధ్రము నంతటిని ఒదిగించిన చక్రవర్తులు. చౌదరిగారు నాటిరాజులెట్లు పరిపాలనము గావించిరో ఈ చిరుకబ్బమున వ్యక్తము చేసినారు. నేటి పరిపాలకులును, ప్రజలును విశాలాంధ్రమును వాంఛించుచున్నారు కనుక కాకతీయుల ఆదర్శములను మన పాలకవర్గము గ్రహించి ఆచరణమునకు తెచ్చుటకు చిత్తశుద్ధితో కృషిచేసిన సఫలీకృత మనోరథులము కాగలమను ప్రబోధమిందు కావింపబడినది. ఈ ఎచ్చరిక శ్రీ భావయ్యా చౌదరిగారి సమయజ్ఞత నెంతయు చాటుచున్నది. వారిప్పట్టున కాకతీయాంధ్రుల రాజ్యవిధానమును గూర్చిన విశేషములను చెప్పుటయె ఉచిత మనుకొనినారు. లేనిచో శైవపండితత్రయము, సోమనాథుడు అన్నమయ్య, జాయపసేనాని, జక్కన, బద్దెభూపాలుఁడు, గోన బుద్ధారెడ్డి, రావిపాటి త్రిపురాంతకుడు, భాస్కరుడు మొదలగు కవి పండిత గాయక, చిత్రకారుల ప్రాముఖ్యమును ప్రతిపాదించెడివారె! కాకతీయ రాజులు, ఆంధ్రావని సర్వతోముఖాభ్యుదయమును సాధించిన తీరులను తెల్పెడివారె! ముఖ్యముగా మన ఆశయసాధనకు ప్రస్తుతము అపేక్షింపఁదగినది పాలకుల ప్రజ్ఞాపాటవములు గదా!

నాటి విశాలాంధ్రకు నేతలయిన కాకతీయులు ప్రభుతల నెట్లు నెగ్గించు కొనిరో, పరాక్రమముల నెట్లు ప్రదర్శించిరో శ్రీ భావయ్యా చౌదరిగారి కృతి

పరిపక్వమొనర్చుచున్నది. ఇందలి పద్యములు సుబోధకములు, రసవంతములునై, చరిత్రలను పరిశోధక సంశోధనమునకు ప్రోత్సహించునవిగా నున్నవి

రెడ్డిరాజుల యొక్కయు, కాకతీయ రాజులయొక్కయు యశస్సును చిరస్థాయి చేయుటకును, తెనుగు ప్రజానీకమున కీచారిత్రక విశేషములు తెలియజేయుటకును కవిగారీ మధుర సులభమార్గము నవలంబించినారు. సంఘ పురోగమనమున కీవిధమగు రచనలు సాయపడగలవు. జాతీయతాభావములను రేకెత్తించుటకు సమర్థములైన రమణీయ వర్ణనములతో నీ కాకతీయాంధ్ర రాజుల చరిత్ర అలరారుచున్నది. ముఖ్యముగా బిరుదావళులతో ప్రాచీన శూరుల ప్రశంసించు పట్టులిందు కుదాహరణములు కాగలవు. యుద్ధవీరులకు ఆంధ్రులు భక్త్యంజలులు ఘటించి తన్మయులు కాగలరు. ఇట్లుత్తేజితులను చేసి, తెనుగువారికి వారి ఔన్నత్యమును గుర్తుతెచ్చు దేశభక్తిపూరితము లగు గ్రంథములు పురాతత్త్వ కోవిదులు ప్రభవింపఁ జేసినచో ప్రజాదరణము తప్పక లభింపఁ గలదని మనవి.

ఇతోధికముగ భాషాసేవ చేయుటకు సంగమేశ్వరస్వామి శ్రీ భావయ్య చౌదరిగారికి ఆరోగ్యము ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాను.

(Sd,) మండలపర్తి ఉపేంద్రశర్మ.

—*—

# కృతజ్ఞత

కోరినంతనే దయతో నీతొలిపలుకు వ్రాసి పంపినందులకు శ్రీ ఉపేంద్ర శర్మగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్లు

కొత్త భావయ్యచౌదరి.

# అంకితము

ఉభయభాషా ప్రవీణ దో - ర్విభవమూర్తి
పరస జాతీయకవితా వి - శారదుండు
శాస్త్రి వెంకట నరసయ - సచ్చరిత్రుఁడు
మిత్రవర్యుఁడు దీనిఁ గాం - క్షించినాఁడు. 1

మిత్రుఁడు సద్గుణగణచా
రిత్రుఁడు దేశహితకార్య - దృక్షుల సుకవి
స్తోత్రుఁడు భారతి గోత్రుఁడు[1]
పాత్రుండగు నితని కోర్కి - భావ్యం బనుచున్. 2

ప్రేమ లాలించు కృతిభర్త - వెదకు కొనక
కావ్యకన్యకు దొరకుటే - గౌరవంబు
నొండొరులు సముచితంబుగ - నుండిరేని
శాశ్వత యశంబు గల్గు ని - స్సంశయంబు
గాన నిదియెంచి యొసఁగితి - కరము ప్రీతి. 3

పండిత మండనుం డనగ - భారత భాగవతార్థవేది మి
త్రుండను సుహృజ్జనావళికి - దోర్బల సాహస శౌర్యవంతుఁ డా
ఖండల వైభవుండు నయి - ఖ్యాతి వహించిన మేటి సుబ్బరా
ర్యుం డతఁడే దండ్రి యీ కవికి - నుత్తమ కమ్మకులాబ్ధిచంద్రుఁడై. 4

అతిశయోక్తులు ధ్వను లలం - కృతులు లేని
వాస్తవికతను గూర్చెడి - వాణి దీని
మాననీయమున కిచ్చి తె - మ్మది వహింతు
కాకతీయ రాజ్య స్థితి - గతులఁ దెలుప. 5

# ఆశీస్సు

ఈ కృతి క్షితి నున్నవరకు
నీ కృతిభర్తకు నొసంగి - యెంతే కీర్తిన్
ప్రాకట శుభము లొసంగుము
నీ కరుణారస సుదృష్టి - నింపి మహేశా. 6

గ్రంథకర్త.

---

1 భారతీసమితి పస్తాన సంఘాధ్యక్షుఁడు.

# స వ ర ణ లు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | శాసనన | శాసన |
| 5 | 21 | బ్రోరా | బ్రోలరా |
| 13 | 3 | తేజలు | తేజులు |
| 19 | 13 | కాయ | రాయ |
| 22 | 14 | చాణుక్య | చాళుక్య |
| 23 | 13 | నన్న | సన్న |
| 31 | 20 | త్సీమ | ల్సీమ |
| 33 | 19 | యేమొ | యేలె |
| 37 | 2 | రా | వ |

# పీఠిక

కావ్య పురాణాదులవల్ల గల్గు రసానుభూతి తాత్కాలికానందము నిచ్చినను, మహాభారతమువంటి యితిహాస గ్రంథములపైననే నాకు మొదటి నుండియు మక్కువ యెక్కువగా నుండెను. అందువల్లనే యెడనెడ గొన్ని యితర గ్రంథములు రచించినను, చరిత్రాగ్రంథములనే హెచ్చుగా నేను వ్రాసితిని. అట్టివానిలో నిది యొకటి. ఈ కాకతీయుల చరిత్ర (క్రీ. శ. 1000 - 1370 మధ్య) ఆంధ్రదేశ పాలనకు సంబంధించినది. ఇది మిక్కిలి ప్రమాణయుక్తములైన శాసనములు, అమూల్య పరిశోధక చరిత్ర లాధారముగా సంక్షిప్త పద్యకావ్యముగ వ్రాయబడినది. ఈ కాలములో మన దేశమున జైన, బౌద్ధమతములు ఆచరణలో కొంతకాలముండి, పిమ్మట నిరాకరింపబడి వాని స్థానమున శైవ వైష్ణవమతములు అమలులోనికి వచ్చుటయు, రాజులు నూతనముగా దేవాలయము లనేకము నిర్మించి మతాభివృద్ధి గావించుటయు జరిగెను. కొన్నిచోట్ల మతయుద్ధములు గూడ కలిగెను. ఆంధ్రదేశమున నీకాలపు తెలుగులిపి శాసనములు కుప్పతిప్పలుగా నున్నవి. సంస్కృతము, తెలుగు భాష లీకాలమున నున్నతస్థాయిలోనికి వచ్చెను. కవు లాదరింపబడిరి. కాని మతభేదములలో ననేక కులము లుద్భవిల్లెను. ఈ యుగాంతమున మహమ్మదీయులు తెలుగుదేశ మాక్రమించుకొన గల్గిరి గాని యీకాలపు టాంధ్రవీరు లెట్టి పరాక్రమములను రణరంగములందు జూపిరో రాజులెట్టి పరిపాలన నొనర్చిరో యీ చరిత్ర విశదపరచును. కాకతీయరాజ్యము మహమ్మదీయు లాక్రమించిన పిమ్మట మరల నొక యర్ధశతాబ్దికాలము మునుసూరి రాజులు జయించి పాలించిన యుదంతముగూడ నిందు చివర వివరింపబడినది. ఆంధ్ర పౌరుష మాకాలమున జయాపజయములకు లెక్కచేయక ప్రదర్శింపబడెను. కాని కాలగతికి నిలువలేక యంతఃకలహముల కాలవాలమై చెల్లాచెదరై తుదకు కొద్దికాలముననే స్థిరమైన తురుష్క రాజ్యస్థాపనకు మూలమయ్యెను. దీని నుండి ఆంధ్రు లిప్పుడుగూడ గుణపాఠము నేర్వదగి యున్నది. పోరు నష్టము పొందు లాభము. అను నదే యీ నీతి. ఈ సంక్షిప్తకావ్యము వయోజనవిద్యలో నుపయోగించబడినచో బాగుండునని నాతలంపు.

సంగం జాగర్లమూడి
అక్టోబరు 1955.

ఇట్లు
గ్రంథకర్త.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | శాసవన | శాసన |
| 8 | 21 | బో లా | బ్రోలరా |
| 13 | 3 | తేజలు | తేజాలు |
| 19 | 13 | శాయ | రాయ |
| 22 | 14 | చాణుక్య | చాళుక్య |
| 29 | 13 | వన్న | సన్న |
| 31 | 20 | త్నీమ | ల్నీలు |
| 33 | 19 | యేమొ | యేలె |
| 37 | 3 | శా | న |

# విషయసూచిక

# కాకతీయరాజుల చరిత్ర

## కాకతీయుల పుట్టుక

## మొదటి బేతరాజు

( క్రీ. శ. 1000 - 1050 దాదాపు )

చంద్రవంశాబ్ధిబుట్టె దు ♦ ర్జయుఁడొకండు
వాని వంశీకులై భువి ♦ వరలువారు
కాకతీదేవతం గొల్చి ♦ కాకతీయు
లనగ జైనమతస్థులై ♦ రాంధ్రసీమ
పదియవ శతాబ్ది పూర్వమే ♦ ప్రబలులగుచు. ౧

హిమకరుని వంశమందున ♦ హేహయుండు
నతని వంశాబ్ధి దుర్జయుం ♦ డధికవీర్యు
లగుచుఁ బ్రభవించి మాహిష్మ ♦ తాదిపురము
లేలిరంచు [1] బురాణము ♦ లెఱుకపఱచు. ౨

కాలవశమున జైనంబు ♦ కాలదన్ని
కాకతీయులు శైవులై ♦ క్రాలినపుడు
వారి సెట్టులో నాల్గవ ♦ వంశమునను
శైవగురువులు జేర్చిరి ♦ సాహసమున. 3

పుడమి పతులందు గొందఱీ ♦ సడినెఱింగి
తరలి యజ్ఞోపవీతముల్ ♦ దాల్చుకతన
వారు క్షత్రియనాములై ♦ వరలినారు
పదియు రెండు శతాబ్దినా ♦ యెవనెఱింగి. ౪

---

1. కూర్మ పురాణము జూడుడు.

ధర్మశాస్త్రంబు లన్నిఁటి ♦ దఱచిచూడ
వేదవిద్యలఁ గర్మల ♦ విధిగ నేర్పి
క్రిందికులములపై వారిఁ ♦ జెందఁజేయ
నగునటంచు బ్రాహ్మణులకు ♦ నాజ్ఞగలదు.[1] ౫

అన్యమతముల వారల ♦ నాదరించి
బ్రాహ్మణ మతాభివృద్ధికై ♦ పాటుపడఁగ
నిట్టి నియమము లున్నను ♦ హెచ్చుగాఁగ
నాచరణ జూపలేరిప్పు ♦ డార్యజనులు. ౬

హనుమకొండలో శాసన ♦ మందుచేత
భూవిభుఁడు దుర్జయాంభోధి ♦ బుట్టెనంచుఁ
జెప్పఁబడె నిట్లె పలుచోట్లఁ ♦ జెప్పినారు
కాకతీయులు దుర్జయ ♦ గణమటంచు. ౭

దుర్జయ కులంబునుండియే ♦ తొలుత గలిగి
కమ్మ, వెలమల నామముల్ ♦ ఖ్యాతికొరకు
దాల్చి రాణించి కొంతటీ ♦ ధాత్రిపైన
భూపతులు భూమికావులై ♦ పోయినారు
శాసనంబులె దీనిని ♦ చాటిచెప్పు. ౮

కొరవి దేశమునందున ♦ ధరణిపతిగ
బేతరాజేల జొచ్చెను ♦ ఖ్యాతిమీర
పదియు నొక్క శతాబ్దిని ♦ ప్రాభవముగ
గాకతీపురమందున ♦ ఘనత కెక్కె. ౯

1. శాన్వాశతపథబ్రాహ్మణము ౭౮-౨-౧-౨౭ ఐతరేయబ్రాహ్మణము. 7-23

ఇతఁడు చాళుక్యవంశాబ్ధి ♦ పృథ్వినేత
విక్రమాదిత్యసామంత ♦ విష్టియగుచు
చోడరాజులతోఁ బోరు ♦ చోట్లజయము
గాంచి పేరొందినట్లుగ ♦ గానఁబడెడి. ౧౦

దుర్జయాన్వయులయ్యుండి ♦ దురములందు
పేరు ప్రఖ్యాతు లార్జించు ♦ వీరవరుల
గలిగి విరియాల వంశంబు ♦ ఘనతకెక్కె
బేతరాజున కాప్తులై ♦ ప్రీతిఁగొలువ. ౧౧

విరియాల యెఱ్ఱనృపతియు
దురమున దోర్బలముజూపి ♦ తోడ్పడుచుండఁగ
అరివీరులు తెగటారిరి
కొరవిని బాలించుచుండ ♦ గుణిబేతనయుఁగ. ౧౨

ఎఱ్ఱసేనానికులకాంత ♦ కెసఁగె కీర్తి
వీరవనితగా గామమ ♦ బేతనృపతి
కంగరక్షయై బాసట♦యగుచు నిలువ
నెందఱో శత్రువీరులు ♦ మ్రందిరపుడు. ౧౩

దురమున గాడయనాయకు
నరివీరుని బల్లవేశు ♦ నంతమొనర్పఁగ
విరియాల సూరనృపతికి
ధరవేలుపు గొండలోని ♦ దాయములిచ్చెఁగ. ౧౪

సూరసేనాని బేతఁడన్ ♦ సూనుఁగాంచె
నతనికిని మల్లనాఖ్యుఁడఁగ ♦ సుతుఁడుగల్గి

భక్తిమల్లేశ్వరుని నిల్పె ♦ ప్రాభవముగ
తనదు గూడూరుపురమున ♦ ధర్మపరత. ౧౫

—:♦:—

# మొదటి ప్రోలరాజు

(1050 - 80)

జగదేకభూషణ ♦ చరితు ధారావర్ష
నృపతిఁ జయించిన ♦ వీరవరుఁడు
గొడవర్తి దుగరాజు ♦ కొడుకును సమరాన
సంహారించిన మహా ♦ సాహసుండు
కాంచీపురి జయింపఁ ♦ గా బ్రహ్మసేనానిఁ
బంపి నిర్జించిన ♦ బాహుబలుఁడు
కొరవి దేశంబున ♦ ధరణీపతిగ నేలి
యన్మకొండవసించి ♦ నట్టి ఘనుఁడు
కొంకణము చక్రకూటము ♦ జంకులేక
దండయాత్రల నిర్జించి ♦ ధాత్రిఁగొనియు
ననుపమాన యశస్వియా ♦ యవని నేత
ప్రోలరాజన్యుఁ డెంతటి ♦ పుణ్యవరుఁడొ. ౧

త్రైలోక్యమల్ల విభుద
న్నేలిన పతిగాగనెంచి ♦ నిజభుజశక్తి
న్నాలములం దెందఱినో
యేలికల జయించె చిత్ర ♦ మేమనవచ్చున్. ౨

పురకుదేశంబు గొన్నయ ♦ ధరణి నేత
పాలనము సేయుచుండఁగా ♦ ప్రోలరాజు
తనవిభుని యాజ్ఞమేరకు ♦ దండయాత్ర
సలిపి నిర్జించెనాతని ♦ సాహసమున. *

భద్రంగపురాధీశుఁడు
రౌద్రము నశియించిపోఁబ ♦ రాభూతుండై
భద్రముగా బరువెత్తెను
తాదృశులం గనుచు జింత ♦ దైవారంగన్. ౪

బ్రహ్మసేనాని రేచెర్ల ♦ వంశజుండు
శౌర్య సాహసముల మేఁటి ♦ వీర్యవంతుఁ
డాహవక్రీడ సల్పుచుం ♦ డంగ నెన్నొ
విజయములఁగాంచె నీప్రోల ♦ విభుఁడు సతము. ౫

కంచి దుర్గ కవాటముల్ ♦ గదలఁ ద్రోచి
చోడ ధాత్రిపు నిర్జించి ♦ చోద్యముగను
నల్దెసల కీర్తి నార్జించి ♦ నాఁడు ఘనుఁడు
బమ్మసేనాని విశ్రుత ♦ బాహుబలుఁడు. ౬

ఈమహారాజు కాలాన ♦ ఋషభనాథ
జైన యతి రాణ్మహేంద్రంబు ♦ చక్క విడిచి
హన్మకొండకువచ్చి యీ ♦ యధిపునాద
రంబున మతాభివృద్ధిఁ జె ♦ లంగఁ జేసె. ౭

—:o:—

## రెండవ బేతరాజు
(సుమారు 1080 - 1115)

సీ॥ గండ్రగొడ్డలి బూని ♦ గండర గండఁడై
విక్రమచక్రినా ♦ పేరుఁజెందె
చలమర్తిగండఁడై ♦ జయలక్ష్మి వరియించి
సత్యవ్రతుఁడను నా ♦ శస్తియయ్యె
మాళ్వచోళనృపాల ♦ మత్తగజంబుల
కరిభయంకర సింహ ♦ మనఁగఁజెలఁగె
హనుమకొండ పురాన ♦ వనమొండు నిర్మించి
శివపురతీర్థంబు ♦ జెలఁగఁజేసె

గీ॥ నచట బేతేశ్వర శివాల ♦ యంబుగట్టి
తనదుపేరిట శాశ్వత ♦ త్వంబు బడసె
నవని త్రిభువనమల్లవి ♦ ఖ్యాతబిరుద
నృపశిఖామణి రెండవ బేతరాజు. ౧

వైజన దండనాథుఁడను
వాఁడు ప్రధానిగ మంత్రతంత్రముల్
ధీజనులెల్ల మెచ్చఁగ సు
ధీవరుఁడై యొనరించుచుండఁగాఁ
బూజితుఁడై స్వదేశమును
బొల్పుగ నేలెను బేతరాజు రా
రాజన "సబ్బిసాయిరము"
రంజిలుచుండఁగ మండలంబులన్. ౨

జైనమతము విడచి ♦ శైవంబు ధరియించి
దానివృద్ధికొఱకు ♦ ధర్మపరత
శైవదేవళముల ♦ శ్రద్ధతో నిర్మించె
బేతరాజు మిగుల ♦ ప్రీతితోడ. ౩

కాలాముఖ శైవశ్రీ
శైలమతాచార్యు నొద్ద ♦ శైవదీక్షలన్
వాలాయంబుగ గొనియెను
పాలించెను మండలంబు ♦ ప్రజ్ఞాబుద్ధిన్. ౪

తండ్రియైన ప్రోల ♦ ధాత్రిపు పేరను
వరుణదేవు నిలిపి ♦ వాసిగాంచెఁ
మతమునందు పరమ ♦ మాహేశ్వరుండయిఁ
పేరుగాంచె నితఁడు ♦ వారిలోన. ౫

విక్రమాదిత్య చాళుక్య ♦ విభు విరాజ
మండలాధిప త్రిభువన ♦ మల్లయంచు
భట్లు కైవారములుసేయ ♦ బ్రతిభ నేలె
సర్వజన సమ్మతముగ నీ ♦ యుర్వియందు
ముప్పదైదేండ్లు జనులెల్ల ♦ ముదముజెంద. ౬

ప్రోలరాజు నాగ ♦ పుత్రుఁడొక్కరుఁడుండె
బేతరాజు పుడమి ♦ వీడినపుడు
రాజ్యభారమెల్ల ♦ రహిధరించి యితండు
పేరుజెందినాఁడు ♦ పృథ్విలోన. ౭

—:o:—

# రెండవ ప్రోలరాజు
## (1115 - 1158)

బేతన ప్రెగ్గడ ♦ ప్రియమైన మంత్రిగా
నుంచి పాలించిన ♦ యూర్జితుండు
తైలపదేవుని ♦ దన చక్రవర్తినే
బంధించి విడచిన ♦ బాహుబలుఁడు
కుంతోరి నేలిన ♦ గోవిందరాజు జ
యించి రాజ్యము హరి ♦ యించె నితఁడు
ఉదయచోడనృపతి ♦ కొసఁగి యీదేశము
బ్రతిభఁగాంచిన సుప్రీ ♦ రవ్రతుండు
మంత్రకూటస్థాన ♦ మహీపుగుండ్రాజును
ఆగ్రహోదగ్రుడై ♦ యాఁజిఁబట్టి

తల గొరిగి ముద్రవై చియు ♦ దనదు కోప
ముపశమింపక జంపిన ♦ నృపవరుండు
ప్రళయకాలాంతకుఁడు శత్రు ♦ వసుల కెల్ల
బేతన కుమారుఁడగు ప్రోల ♦ పృథ్వీనేత. ౧

మాండలిక రాజులంగూడి ♦ మత్సరమున
ననుమకొండ జగద్దేవుఁ ♦ డాక్రమింప
నెంచి యొకదండయాత్ర గా ♦ వించినంత
క్షణములో బారఁద్రోలె నా ♦ త్మ్యాతలేశుఁ
బ్రోలరాజెంత సునిశిత ♦ బుద్ధివరుఁడొ. ౨

రామేశ్వర దీక్షితుఁడే
యీమాన్యుని గురువుగాఁగ ♦ నేర్పడి యొంతో
నీమమున ధర్మసత్రము
లామాహేశ్వరుని గుడుల ♦ నధిక మొనర్చెన్. ౩

బాధితులు సాధువులకును ♦ బ్రాహ్మణులకు
కుంటి, గ్రుడ్డికి వికలాంగ ♦ కోటికెల్ల
నన్నదానంబు గావించు ♦ ననవరతము
రాజగురు వెంతొ సుగుణ వి ♦ రాజితుండు. ౪

ప్రోలరాజు తనకు ♦ ముప్పమ దేవిని
రాణిగా వరించి ♦ రాజ్యమేలి
పంచపాండవులుగఁ ♦ బ్రభగాంచు పుత్రుల
నైదుగురను గాంచి ♦ యతిశయిల్లె. ౫

రుద్రదేవుఁ డొకఁడు ♦ రూఢికెక్కిన మహా
దేవుఁడొకఁడు గలరు ♦ దీర్ణగుణులు
కడమవారిపేర్లు ♦ కాలగర్భంబున
లీనమగుట చెప్ప ♦ లేము యిపుడు. ౬

రాజ్యమును విస్తరించి య ♦ రాతిభయము
నడచిపాలించె నీప్రోల ♦ పుడమినేత!
కాకతీయాంధ్ర రాజ్యమ్ము ♦ కల్మిగనుట
నితనితో మొదలయ్యెనా ♦ నేలెనపుడు. ౭

కడలాలయము నతని ప్రె
గ్గడ సతియగు మైలమాంబ ♦ గట్టించియు నం

దెసతెగని భక్తిచే గ
న్నడమున వ్రాయించె శాస ♦ నం బొండ్లచటన్.
తన చేతమంత్రి త్రవ్విం
చిన చెరువున కిచ్చెఁ బ్రి ♦ యముచే భూదానం
బును ద్వాదశమ త్తరులం
జనసౌఖ్యము నెంచి ప్రోల ♦ జననాథుండున్. ౯

వెలనాడు జయింపఁగ ♦ త్సో
తలనాథుండేగినంత ♦ దాని నృపుండా
వెలనాటి చోడరాజే
యలమున నీవిభు నణంచె ♦ నట శౌర్యమునన్. ౧౦

నలుబదేండ్లు పైన ♦ నరనాథుఁ డీరీతి
పాలనం బొనర్చి ♦ ప్రజలనెల్ల
వీరస్వర్గమునకు ♦ వెడల నాతనికీర్తి
యుర్వి బర్వె దిశల ♦ నుత్కటముగ. ౧౧

ప్రోలభూపతి మరణింప ♦ నాలమందు
రుద్రదేవుఁడు రాజ్యాధి ♦ రూఢుఁడయ్యె
హనుమకొండ పురాన ద ♦ న్నలముకొనిన
గట్టముల దాట దాల్చెనా ♦ గంకణంబు. ౧౨

—:o:—

# రుద్రదేవుఁడు
(1159 - 1195)

సీ. పొలవాస మేలెడి ♦ భూపుమైలగిదేవు
శౌర్యగర్వమ్ములు ♦ సమయఁజేసె
మేడరాజను వాని ♦ మితిలేని మోసముల్
దెలిసి జయించెను ♦ ధీరుఁడగుచు
అశ్వసైన్యాధ్యక్షుఁ ♦ డగు దొమ్మరాజును
తరిమి పురంబులఁ ♦ దానె గొనియె
యెనుబదివేలకు ♦ నెదురింప శాత్రవ
సైన్యంబులం ద్రోలి ♦ సాహసమునఁ
రుద్రదేవుఁ డాహవవీర ♦ భద్రుఁడనగ
పేరుగాంచె మహీస్థలి ♦ వీరనృపులఁ
దైలప మహీశుఁ డాతని ♦ దర్పమెంచి
భయముచే మంచమెక్కి వి ♦ భ్రాంతుఁడగుచు. ౧

సీ. వర్ధమాన పురాన ♦ వర్ధిల్లు గోకర్ణ
భీమచోడాదుల ♦ సీమలఁగొనె
నుదయచోదుని జంపి ♦ యువిదపద్మావతిం
బెండ్లియాడియు ♦ మహావీరుఁడయ్యె
అరిపురంబుల గొన్ని ♦ యగ్నిపాల్జేసియుం
దంగు తటాకము ♦ లమరజేసె
పొట్టిపుంబుచ్చ నా ♦ భూమీశు జగదేవు
గెలిచి యారాజ్యంబు ♦ గేలనందె

అపర ముక్కంటియనఁ ఖ్యాతి ♦ నంది శౌర్య
సాహసాది గుణంబులఁ ♦ జాలఁగాంచి
దుర్నిరీక్ష్య తేజుండయి ♦ దోర్బలమున
రుద్రదేవ విభుండను ♦ రూఢికెక్కె. ౨

సంస్కృతాంధ్రభాషా కవులను ♦ సాదరమున
పోషణంజేసి విద్యావి ♦ భూషణుఁడన
ఖ్యాతిగాంచెను పండిత ♦ కవియునగుచు
నీతిసారంబు రచియించె ♦ నియమమొప్ప. 3

ఉత్తరము మాల్యవంతంబు ♦ నున్నవరకు
దూర్పున సముద్రతీరంబు ♦ దోచువరకు
దక్షిణంబున శ్రీశైల ♦ ధాత్రివరకు
పడమరం గటకాపురి ♦ వచ్చువరకు
రాజ్యమును విస్తరించనీ ♦ రాజవరుఁడు
యత్నముల బెక్కులొనరించె ♦ నహరహంబు. ౪

వెల్లకిగ్రామవాసియై ♦ చెలఁగు పండి
తుండు గనియు సమర్థుఁడై ♦ యుండఁజూచి
వానికి నమాత్యపదవిచ్చి ♦ వాసిగాంచె
నతఁడు గంగాధరాఖ్యయ ♦ మాత్యవరుఁడు
నతడెనగరూరు శాసన ♦ కృతినొసంగి
రుద్రదేవుని కరుణనా ♦ రూఢుఁడయ్యె. ౫

రుద్రభూమీశు కరుణచే ♦ రూఢికెక్కె
యతఁడు విద్వజ్జనుల కగ్ర ♦ హారములిడి
శిల్పవిన్నాణకళలను ♦ జిలుకునట్లు

శైవవైష్ణవాలయములఁ ♦ జాలనిలిపి
సప్తసంతానము లొనర్చి ♦ తృప్తిజెందె. ౬

ఇందులూరివంశ్యు ♦ లిద్ధతేజస్కు మల్ల
నాఖ్యసోదరులకు ♦ నమితప్రీతి
పౌరపాలనంబు ♦ బంచియొసంగెను
రుద్రదేవుఁడంత ♦ భద్రమొప్ప. ౭

అనువుగా లేకయుండిన ♦ హనుమకొండ
రాజధానిని యేకశి ♦ లాస్థలమున
నూత్నసగరాననుంచి ప్ర ♦ యత్నమునను
గోటలం బేటలంబెంచి ♦ మేటియయ్యె. ౮

చాలసీమలనుం గొని ♦ చక్రవర్తి
యనఁగఁ బేరొంది వానిలో ♦ దనకుహితులు
మండలాధిపులంగూర్చి ♦ మాన్యుఁడగుచు
దనప్రతాప విస్ఫూర్తిచే ♦ ధాత్రినేలె
మేళమాంబిక రాణియై ♦ మెప్పులంద. ౯

సీ॥ ఆమనగంటిలో ♦ నాధిపత్యముసిచ్చె
రేచెర్ల నామయ రెడ్డివరుని
కాతని సోదరుం ♦ డధికపరాక్రముం
డగు బేతిరెడ్డిని ♦ యధిపుఁజేసె
పద్మనాయకులకు ♦ బాహువిక్రములకు
సేనాధిపత్యముల్ ♦ జెలఁగఁజేసె
పలనాటిపోరిలో ♦ నలగామునకు వేయి
యశ్వముల్ పంపి సా ♦ యంబొనర్చె

దేవగిరిలోని యాదవ ♦ పృథ్వీపతులు
జైత్రుపాలక ముఖ్యులు ♦ శత్రులగుట
వారితోయుద్ధముల నెన్నొ ♦ వరుససలిపి
సమసె నటయందె నీరుద్ర ♦ చక్రవర్తి. ౧౦

తనదు సామంతులకు బిరు ♦ దప్రదాన
రాజలాంఛనముల నెన్నొ ♦ రక్తినిచ్చి
మండలేశ్వరులఁజతి ♦ మన్ననలను
గాంచుచును సార్వభౌముఁడై ♦ మించెగీర్తి. ౧౧

కమ్మ వెలమల నామముల్ ♦ గల్పనంబొ
నర్చి కొందఱు దుర్జయు ♦ నాయకులజు
లకును గౌరవములనిచ్చి ♦ రాణఁజెందె
రుద్రభూపుండు గౌరవ ♦ రుద్రుఁడనఁగ. ౧౨

జాతిపితగ నితని ♦ జాతురు వెలమలు
పద్మినికిని బుట్టి ♦ పద్మలైరి
[1] పద్మనాయకులన ♦ బ్రతిభగాంచిరివీరు
లాహవముల నితని ♦ కాశ్రయులుగ. ౧౩

ముప్పదేనిమిది వత్సరాల్ ♦ మోదమునను
రాజ్యపాలన ముంజేసి ♦ రాణకెక్కె
రుద్రదేవుండును బ్రతాప ♦ రుద్రుడయ్యు
గాలవశమున బలియయ్యె ♦ గదనమునను. ౧౪

బౌద్ధ, జైన, శైవ ♦ వైష్ణవ మతము లొం
డొందు వైరబుద్ధి ♦ యుర్విమీద

1. కొందరీ పద్మశబ్దము సంఖ్యార్థ మనుచున్నారు. పద్మమనసంఖ్య. 72

ప్రబలి యుద్ధములను ♦ బల్హారు సాగించి
రీ శతాబ్దియందె ♦ యెన్నొచోట్ల. ౧౫

పండితారాధ్యుఁడోక ప్రక్క ♦ బసవనయును
వీరశైవంబు బోధింప ♦ వెఱ్ఱెత్తి
జనములుం బౌద్ధప్రజలును ♦ జైనజనుల
నడఁప మతయుద్ధము లొనర్చి ♦ రపుడు సతము.

వీరవైష్ణవ మతమొండు ♦ నేరుపరచి
ధరను రామానుజాచార్య ♦ గురుఁడు నంత
సర్వజాతుల వారును ♦ చక్రనందు
జేరుఁడని బోధలఁ సల్పి ♦ బోరులయ్యె. ౧౬

రుద్రదేవుండు నెందు బా ♦ ల్గొనక శైవ
వైష్ణవాలయములకును ♦ భేదమెంచ
కుండ భూముల నిచ్చుచు ♦ నుండెగాని
బౌద్ధ జైనంబులం ద్రోచి ♦ వైచెనంద్రు. ౧౭

పాల్కురికి సోమనాథుండు ♦ పండితుండు
రుద్రభూపుని ప్రేరేప ♦ రుద్రసంఖ్య
బ్రాహ్మణాగ్రహారము లిచ్చి ♦ పడసె కీర్తి
సప్తఋషి గురువులపేర ♦ జగతి వెలయ. ౧౮

శైవాలయము లనేకము
భూవల్లభుఁడంత దేశ ♦ మున నిర్మించెన్
దేవళపోషణ విప్రుల
కీవిగనిడె గ్రామములను ♦ యెనుబదినాల్గున్. ౨౦

శిల్పసౌందర్య మెల్లెడ ♦ జిలుకుచుండ
యంగరంగ వైభవము( జె ♦ లంగ( జేసి
వేదవిధి దేవతాపూజ ♦ విప్రజనులు
సల్పున ట్లాలయంబుల ♦ నిల్పెనత(డు. ౨౧

—:♦:—

## మహాదేవు(డు

(1196 - 8)

ఈమహాదేవు( డోర్గల్లు ♦ నెంత కాల
మెలమి బాలించెనో దాని( ♦ దెలియ లేము
ఒకటి రెండేండ్లు పాలించి ♦ యుర్వివీడ
వతని పుత్రు(డు గణపతి ♦ యధిపు(డయ్యె. ౧
బయ్యమాంబ యనెడి ♦ పత్నితో సుఖముండి
కాంచె సుతుని సుతను ♦ గణపతీశు
కుందమాంబికలను ♦ గోరిక మీర(గా
గూతునకు నొసంగె ♦ కుందపురము. ౨
నతవాటి నేలు రుద్రుని
కతికౌతుక మొప్ప నిచ్చె ♦ నభ్యుదయముకై
సుత కుందాంబను సతిగా
మతిమంతుండైన రాజు ♦ మహాదేవుండున్. ౩
భక్తితత్పర కుందాంబ ♦ బ్రాహ్మణులకు
ధారవోసె నాగ్రామము ♦ దారబుద్ధి

శాణియాజ్ఞను బాలస ♦ రస్వతియను
సత్కవీంద్రుఁడు రచియించ ♦ శాసనంబు. ౪

ఈమహాదేవ నృపాలుం
డీమహిఁ వీడి పరమునకు ♦ నేగినపిదపన్
నేమమెఱిఁగి గణపతియును
నీమంబున నేలె ధారుణీతలమందున్. ౫

—:o:—

## గణపతిదేవ చక్రవర్తి
(1198 - 1260)

సప్తమచక్రవర్తియన♦సాహసమొప్ప జయించిమండలా
ప్తులుబంధువర్గ్యులన♦నారతముందగుచోట్లనిల్పుచున్
గుప్తవిధాన బాలనము♦గొప్పఁగ సల్పుచు చారచక్షుఁడై
తృప్తిపడంగనెల్లప్రజ♦దేశమునందునొసర్చియత్నముల్

కొలను నాయకులను ♦ బలమునననిర్జించి
దర్పమున గళింగ ♦ ధాత్రినంది
గోతమీతటమున ♦ గొల్చివీడునడంచి
గోఁగునాఁడు బలిమి ♦ గొనియె నితఁడు. ౨

వెలనాటిని నిర్జింపఁగ
జలముంగొని గణపతియును ♦ జయ్యన వేడలెన్
నలుప్రక్కల సామంతుల
గలుపుకొనుచు దండయాత్ర ♦ గడుభీకరుఁడై. 3

దుర్లభంబై నదిది గొని ♦ దోర్బలమున
మాండలిక రాజ్యములనెల్ల ♦ మహితశక్తి
లోబడఁగజేసి తా నాంధ్ర ♦ లోకమెల్ల
దిగ్విజయయాత్రసల్పె న ♦ ద్దిక్కులందు
శాతవాహనరాజ్య ♦ విస్తరణబోలి. ౪

దండనాథుజేసి ♦ తగనిందులూర్వంశ్యు
సోమరాజు బంపి ♦ సీమమెప్ప
మండలములనెన్నొ ♦ మన్నెభూములనెన్నొ
వశము జేసికొనుచు ♦ వాసిఁగాంచె. ౫

సీ॥ గంగయ సాహిణి ♦ కాయస్థకులునకు
బాహత్తరినియోగ ♦ [1] పదవినిచ్చి
శివదేవగురువు నా ♦ యవిరళసామ్రాజ్య
మంత్రాంగముల దెల్పు ♦ తంత్రుఁజేసి
రేచెర్లనామయ ♦ రెడ్డి రుద్రయ
చేతరెడ్లసీమలను ♦ బాలింపనిచ్చి
మల్యాలవంశ హే ♦ మాద్రిరెడ్డికి గూడ
సైన్యాధికారంబు ♦ చక్కనొసఁగి
కాట, చౌ ♦ డయనామ మేటి సేనానుల
నిర్మలప్రాంతాన ♦ నిలిపి యేలి

గీ॥ పొత్తపియు, గమ్మనాడును ♦ ములికినాడు
సకిలినాడేర్వనాడును ♦ సంగ్రహించి
యింక రేనాడు మొదలగు ♦ నెన్నొనాళ్లు

1. 72 వృత్తి, యుద్యోగములపై యధికారము.

గండకోటను నిర్జించి ♦ కంచిలోన
బాండ్యభూపాలు సుందరుఁ ♦ బారద్రోలి.
గణపతీంద్రుఁడు వీకమై ♦ ఖ్యాతిఁగొనియె. ౫

వీరగణపతి నేతనె ♦ ల్లూరిపురము
గాల్చి ద్విరదంబులం గొన్ని ♦ కానుకలందు
చునుకులోత్తుంగ రాజేంద్ర ♦ చోడుబట్టె
చోళమండలమున రణ ♦ కేళిలోన
నాంధ్రపౌరుష మెల్లెడ ♦ నతిశయిల్ల. ౬

సీ॥ గాయగోవాళాంక ♦ ఖడ్గనారాయణ
బిరుదముల్ కొందరు వీరులకిడి
గండపెండేరక ♦ గండరగండఁడీ
త్యాదులకొందరి ♦ కమరనొసఁగి
రాయపితామహ ♦ రాజ్యప్రతిష్ఠాప
కాదుల వీరన్రు♦ పాళికిచ్చి
ప్రతిగండభైరవ ♦ రక్కసగంగాది
యోధరత్న బిరుదు ♦ లొసఁగి మఱియు
బంచమహాశబ్ద ♦ ప్రభుచిహ్నములనిచ్చి
పల్లకీలశ్వముల్ బహుమతులిడి

గీ॥ తనదు సామంతసైనిక ♦ ధరణివిభుల
శౌర్యసాహస కృత్యముల్ ♦ సరవిఁగాంచి
మన్ననలజేసి తగురీతి ♦ మహితకీర్తిఁ
గాంచియేకాతపత్రంబు ♦ గాగనేలె
నాంధ్రరాజ్య రమాకాంత ♦ నతఁడుప్రీతి. ౭

తనపేర నూర్లకొల్లదిగ
జనపదములఁగట్టి జనులు ♦ సౌఖ్యపడంగ
ఘనమగు నూతులఁజెర్వుల
ననేకముగ నేరుపరచె ♦ నతిధార్మికుఁడై. ౭

దృఢతమంబగు శివభక్తి ♦ మీఱుచుండ
శైవదేవళ శతముల ♦ సంఖ్యనిలిపి
శిల్పచాతుర్య రచనా ♦ విశేషములను
వానిబోషింప భూముల ♦ దానమిచ్చె
నన్నిదిక్కుల దనమత ♦ మతిశయిల్ల. ౮

వెల్మవీర ప్రసాదిత్య ♦ విభుఁడు ఘనుఁడు
డెబ్బదేడ్గురు నాయకుల్ ♦ తీవినడప
దుర్గరక్షణ కార్యముల్ ♦ దూరదృష్టి
వృద్ధిజేసెను భావ్యభి ♦ వృద్ధిఁగోరి. ౯

సమరగాంగేయుఁ డననొప్పి ♦ శౌర్యపటిమ
నాంధ్రులు వసించు ప్రాంతాల ♦ నన్నిగెలిచి
యాంధ్రజన చక్రవర్తిగా ♦ నభినుతింప
నేలె నరువదిరెండేండ్లు ♦ లిద్ధమతిని. ౧౦

మోటుపలి రేవుపట్టణ ♦ మున ననేక
వసతులంజేసి పరదేశ ♦ వణిజకోటి
కభయమిచ్చి వ్యాపారము ♦ లతిశయిల్ల
సిద్ధదేవుని బాలకుం ♦ జేసెనచట. ౧౧

ప్రముఖులగు ద్విజులకు నూత్న ♦ పదవులిచ్చి
ప్రజలు వృద్ధుల గౌరవ ♦ భావమునను

బూజనల్పుఁగఁ బ్రేమచే ♦ బ్రోత్సహించి
శాస్త్రకళ లన్నిబోషించి ♦ సమతనెంచి
ధర్మరాజన బేరొందె ♦ ధరణివిభుఁడు. ౧౨

సీ. ఘనతటాకము లెన్నొ ♦ గట్టింప మండల
నేనానులకు పెక్కు ♦ నానతులిడి
కరణముల్ జైనుల ♦ క్రమముగ వర్తింప
దలఁచ నియోగుల ♦ నిలిపియందు
జైనమతస్థుల ♦ సమయించి గొందఱ
వసతిభూములు లాగి ♦ వైచిపిదప
గోళకీమఠమును ♦ గొప్పగా నిర్మించి
సత్రాలయంబుల ♦ జక్కనిలిపి
ప్రీతి నారోగ్యశాల ప్ర ♦ సూతిశాల
ప్రజలకొరకయి నిర్మించి ♦ బహువిధముల
వృద్ధికై గ్రామముల నిచ్చి ♦ వినుతయశము
గాంచెనీ చక్రవర్తి లో ♦ కత్రయముల. ౧౩

విశ్వేశ్వర శివదేశికు
శాశ్వతముగ నచట నిలిపి ♦ జనులకునెంతో
విశ్వాసము గలిగించుచు
విశ్వేశ్వర సేవసల్పె ♦ పృథివీశుండుర్విన్. ౧౪

రాణి సోమాంబ పట్టపురాణివలన
పుత్రసంతాన మతనికి ♦ బొదలకున్నఁ
బడతు లిర్వురఁగాంచె నీ ♦ ప్రభుఁడు వరుస

రుద్రమయు గణపాంబనా ♦ రూఢికెక్కి
పేరుగాంచిరి దమ సరి ♦ వారలందు. ౧౭

వారసులేని చింత నీ ♦ ధారుణీశుఁ
డంత రుద్రమ పురుషుఁడే ♦ యంచు బ్రచుర
పరచికొన్నాళ్ళు వేషాల ♦ భాషలందు
పెండ్లితంతొండు నడిపెను ♦ వింతసరణి. ౧౮

ముమ్మడాంబ దెచ్చి ♦ ముదిత పెండ్లినొనర్చి
రుద్రదేవుఁడంచు ♦ రూఢిపరచి
శత్రుభయము మెఱింగి ♦ సమయజ్ఞుండై
ధాత్రి నేలెనితఁడు ♦ ధర్మపరత. ౧౯
దేశమున శాంతి నెలకొన ♦ దివిరి రుద్ర
మాంబ చాళుక్య వీరభ ♦ ద్రాఖ్యపతికి
నిచ్చి వైవాహికమునల్పె ♦ నెంతొయుక్తి
వినుత చాళుక్యవంశంబు ♦ ఘనత నెంచి. ౧౦
ఆతనికి సోదరుండయి ♦ ఖ్యాతిజెంద
ముమ్మడాంబను మహాదేవ ♦ భూపునకిడి
పరిణయమునల్పె నీరీతి ♦ వంశవృద్ధిఁ
గోరి యీసార్వభౌముఁడు ♦ దూరదృష్టి. ౧౧
మరియొక కుమారి గణపాంబ ♦ ధరణికోట
బేతరాజున కిచ్చెను ♦ ప్రీతితోడ
వీరలందఱు దనరాజ్య ♦ వృద్ధిగోరి
సాయపడుచుండ నీరాజ ♦ చక్రవర్తి. ౨౦

పిన్నచోడుసుతలఁ ♦ బేరమ నారమాం
బలను గమ్మనాటఁ ♦ బరిణయమయి
దెలుఁగుచోడులందు ♦ ధీరులయ్యునవంశ్య
లగుటనెంచి నృపతి ♦ యాత్మలోన. ౨౧

వీరిసోదరుండు ♦ పౌరుషశాలియా
జయపనాయకునకొ ♦ సంగెనంత
కదనరంగములను ♦ గజసైన్యనివహాల
యాధిపత్యమొకటి ♦ యమితప్రీతి. ౨౨

నృత్తశాస్త్రంబు రచియించి ♦ పేరుజెందె
జయపనాయకు శాస్త్రజ్ఞుని ♦ శారదుఁడన
సంస్కృతాంధ్ర కవీశ్వరుల్ ♦ జాలమంది
మన్ననలఁ గాంచుచుండిరి ♦ మహిపులకడ. ౨౩

వేదవేదాంత విజ్ఞాన ♦ వేత్తయగుచు
సంఘవిషయంబు లన్నిఁట ♦ శ్రద్ధగల్గి
తగిన యాలోచనలజెప్పి ♦ ధారుణీశు
నడపగల్గెను శివదేవ ♦ నామగురువు. ౨౪

తిక్కన సోమయాజి శివ♦దేశికు నెంతగనో నుతించిపె
న్మక్కువ మన్మసిద్ధి జన♦నాధుని దోడ్కొనిచక్రవర్తికిఁ
బ్రొక్కఁగజేసి రాజ్యమును♦ముచ్చటగానిలుపంగజేసితా
నక్కడభారతంబుజను♦లందఱుమెచ్చరచించెబ్రౌఢతన్.

కమ్మనాటినిబాలించు ♦ ఘనులునన్న
చోడుడుంద్రిభువనమల్ల ♦ చోడనృపతి
కందుకూరేలు మాధవ ♦ కాంతుఁడొకఁడు

శూరవర్యుఁడోపిలి సిద్ధ ♦ చోడరాజు
మండలేశ్వరులయ్యు సా ♦ మంతులైరి. ౨౬

కొండపడమటిరాజులు ♦ కోటనృపులు
నాతవాటులు గుడిమెట్ట ♦ భూతలేశు
లందఱును బంధుగులును సా ♦ మంతులగుట
జక్రవర్తి కెఁ సన్నల ♦ సంచరింత్రు. ౨౭

దండనాయక మల్యాల ♦ గుండవిభుఁడు
బూదపూరున నిల్పెసి భూపుపేర
గణపసంద్రము దేవళాల ♦ ఖ్యాతిమీర
నరవి యీశ్వరసూరి శా ♦ సనము జెప్ప. ౨౮

కొండిపర్తి సరోవర ♦ మొండుగట్టి
చౌండసేనాని దేవళ ♦ మొందునిలిపె
కాటసేనాని నిర్మించె ♦ ఘనుఁడునాత్రి
మూర్తులకు నాలయంబులీ ♦ భూపునాజ్ఞ
జీవకళ లుట్టిపడగ నా ♦ శిల్పరచన. ౨౯

రుద్రమాదేవి రాజ్యాధ ♦ రూఢఁజేసి
దేశికుని తంత్రమెఱిఁగి వ ♦ ర్తింపుమనుచు
హితము బోధించియును గణ ♦ పతినరేంద్రు
డంతఁ బరలోకముం జెందె ♦ శాంతమతిని. 30

—:♦:—

# రుద్రమదేవి పాలనము

(క్రీ. శ. 1260-95)

ఉ. ఆదుది రాజ్యపాలనము
నందె నిఁకేమని చుల్కఁజేయుచున్
బీడనొనర్ప శౌణపృధి
వీపతిముఖ్యులు కుట్ర సల్పి వెం
టాడినఁ బారఁద్రోలి తన
ధాకకునిల్వకఁ దాగియున్న నా
జాడ లెఱింగి రుద్రమయు
జయ్యన నుక్కడగించె వీకమై. ౧

గీ. మూఁడులక్షల సైన్యంబు ♦ గూడివచ్చి
పదియు నైదుదినంబులు ♦ పటుతరముగ
ఘోరయుద్ధ మొనర్చియుఁ ♦ బారిపోయె
నా మహాదేవనరపతి ♦ యాదవుండు
రాణి రుద్రమ దాపరా ♦ క్రమ మెఱింగి. ౨

ఆ మహాదేవనృపాలుం
డా మెతచేఁ గోటిరూక ♦ లర్పించె వెసన్
భూమీశ్వరి కపరాధము
గా మహీదేవగిరి దనకు ♦ గ్రమ్మఱ నిడఁగన్. 3

సీ. మల్యాలగుండయ ♦ మహాసీయసేనాని
దక్షిణభుజముగాఁ ♦ దనరుచుండ
పట్టసాహిణి యుగు ♦ పడికము బొపదే
వడు సర్వసేనాధి ♦ పతిగ నుండ

కాయస్థ త్రిపురాంత ♦ కమహాదేవుండును
బాహత్తరినియోగ ♦ పదవినుండ
పోతినాయుడు, వాని ♦ పుత్రులున్నూరప
మారయాదులు దును ♦ మాడ నరుల
జన్నిగదేవండు ♦ సాహిణియై మార్జ
వాడి పల్నాడును ♦ బానుగల్లు

గీ. మున్ను గాంగల సీమల ♦ నున్న శత్రు
మాండలికరాజు లందఱి ♦ మద మడంచి
బ్రహ్మరాక్షసుం డనం బేరు ♦ బడసియుండ
రుద్రమాదేవి రాజ్యంబు ♦ గూఢికెక్కె. ౮

సీ. కోసగిమైలిని ♦ గుణహీను హతమార్చి
యుప్పలసోమయ ♦ నుక్కడంచి
పండ్రిభూపాలుని ♦ బరిమార్చి యాజిలో
నక్కినాయునిగూడ ♦ హతమొనర్చి
మేడిపల్ కాచయ ♦ మృత్యువీటికి బంపి
కందూరికేశవు ♦ మందంజేసి
వొరువరాజుల నెల్ల ♦ దురమున నోడించి
అల్లుగాం గనువాని ♦ నని జయించి
శ్రీపతి గణపతిం ♦ జెండి పారంగంద్రోలి
దామోదరకదంబు ♦ దర్ప మడంచి
ఆపాకభీముని ♦ రణరంగమున బంపి
కడమవీరులను జీ ♦ కాకుపఱచి

గీ. యెంబదేవయ గోనగ ♦ న్నాది ప్రముఖ
సాహిణులు సైన్యనివహముల్ ♦ సంగరముల
దిగ్విజయములఁ గూర్పఁగాఁ ♦ దేజరిల్లి
దేశకల్లోలము నడంచె ♦ దిక్కులందు
రుద్రమాదేవి నిర్నిద్ర ♦ భద్ర యగుచు. ౫

సీ. తన కృపాణము వైరి ♦ జనబృందహృదయాంత
రముల భేదించు మా ♦ ర్గములఁగనఁగ
దన వేషభాషలు ♦ దండనాయకులకే
వెఱపుబుట్టించెడి ♦ విధముదోపఁ
దన ధైర్యసాహస ♦ ఘనకార్యనిర్వాహ
శక్తి ప్రజానీక ♦ రక్తిఁగాంచఁ
దనమేరు గంభీ ♦ రతకుమెచ్చి మంత్రి సా
మంతకోటులు దమ ♦ చింతవీడ

గీ. చతురుపాయ ప్రవీణయై ♦ సాహసమున
లాలితము వీరపురుషైక ♦ రవణమొప్ప
ఘోరరణరంగములఁ బోరు ♦ వీరమాత
శౌర్యసముపేత రుద్రమ ♦ క్ష్మాధినేత. ౬

గీ. ఆదవని, తుంబుకము, మాన్వ ♦ హాలువాది
దుర్గముల నెల్ల సాధించి ♦ దోర్బలమున
గోనగన్నయ సాహిణి ♦ కుతుక మొప్పఁ
జక్రవర్తిని మన్ననల్ ♦ జాలఁ బడసె. ౭

గీ. దుర్జయాన్వయు లందున ♦ దోర్బలులయి
ప్రోలకాతు కుమారులు ♦ రుద్ర పోతి

నాయకులు సంగరక్షకు ♦ లై చరింప
తంత్రపాలుఁడు వల్లయ ♦ దనకు సాయ
పడఁగ రుద్రమదేవియు ♦ బ్రతిభఁజూపె. ౮

గీ. కంపకోటను వెలుపలఁ ♦ గట్టఁజేసి
మట్టికోటను లోతట్టు ♦ గట్టిపఱచి
వీనిచుట్టు నగడ్తల ♦ వెలయఁ జేసి
ఱాతికోటను నెలకొల్పె ♦ రాజధాని. ౯

ఱాతికోటకు నెప్పు డ ♦ రాతిభయము
గలుగకుండ సోపానముల్ ♦ గలుగఁజేసి
బురుజులుం దిడ్డి కవనులు ♦ పొల్పుగ నిడి
వీరభటులను గాపుంచు ♦ విధిగ నెపుడు. ౧౦

ఱాతికోటలోఁ గన్పడు ♦ రాజసౌధ
భర్మ్యహర్మ్యంబు లెన్నియో ♦ పలువిధములు
చెర్వులుం బావు లంగడుల్ ♦ సెలువుమీరు
వివిధ ఫలవృక్ష వనములు ♦ వెలయుచుండి
కనులపండువుగాఁగను ♦ గ్రాలుచుండు. ౧౧

గోళకీశైవసంస్థకుఁ ♦ గూర్మితోడ
రాణి రుద్రాంబ తనకీర్తి ♦ రాణకెక్క
వెలగపూడిగ్రామంబును ♦ వేడ్కనొసఁగె
వైద్య విద్యాన్నసత్రముల్ ♦ వరల నందు. ౧౨

వీరభద్రులు, శిల్పులు ♦ వీరముష్టి
పాటకత్తెలు, కరడులు ♦ వంటవారు

వేద వేదాంగశీలురు ♦ వైద్యతతియు
వాద్యములుసల్పువార లం ♦ బట్టుఁ డొకఁడు
నృత్తవేశ్యలు, స్థపతి, శా ♦ సెయును గుమ్మ
రియుఁ బ్రజాసేవకై యాంధ్ర ♦ భృత్యు లచట.

తన ప్రియపుత్రిక రుయ్యాం
బను సాహసుఁ డిందులూరి యన్నయదేవుం
డను సేనాని కొసంగి ప
రిణయంబున్ సల్పె నట వ ♦ రింపఁగ వధువున్. ౧౪

రాయ చౌహత్తమల్లు నా ♦ రాణ కెక్కె
ధరను మోటుపురిరాజుల ♦ దర్ప మడఁచి
దుర్గముల నెన్నొ సాధించి ♦ దోర్బలమున
నన్న దేవసేనానియు ♦ వన్నె కెక్కె. ౧౫

సాలెపట్టును బోలిన ♦ సన్ననూలు
బట్టలును రంగుసెల్లాలు ♦ గట్టు చుందు
రా మహారాణిరాజ్యంబు ♦ నందుఁ బ్రజలు
వజ్రములు కుప్పతిప్పలై ♦ వరలు వీట. ౧౬

నీతిధర్మంబు లన్నిఁట ♦ నియమ మొప్పఁ
బ్రజలు వర్తించుచుందురు ♦ బహువిధముల
భక్తి విశ్వాస గౌరవ ♦ భావములను
జూతు రచ్చటిజనులు భూ ♦ నేత లన్న. ౧౭

వీరకాంతామణి యటంచుఁ ♦ బేరుఁగాంచి
ప్రజల మత సౌఖ్యవృద్ధికిఁ ♦ బాటుపడుచు
విప్రకవిసూరిమాన్యముల్ ♦ వృద్ధిజేసి

యంబ పాలనమే మంచి ♦ దంచుఁ బొగడ
రాణి రుద్రమ యీయాంధ్ర ♦ రాజ్య మేలె. ౧౮

రాణి రుద్రాంబ శ్రీశైల ♦ రాజమందు
మల్లికార్జున కళ్యాణ ♦ మంటపంబు
భక్తినిర్మాణ మొనరించె ♦ ప్రజలు బొగడ
నిలిచియున్నది నాటికి ♦ నేటికచట. ౧౯

ముప్పదైదేండ్లు లీరీతి ♦ మోదమునను
ఓరుగల్లు రాజధానిగ ♦ నొప్ప నేలి
తుదకు వీరప్రతాపరు ♦ ద్రునకు నప్ప
గించి రుద్రమయుం గృత ♦ కృత్య యయ్యె. ౨౦

—:♦:—

## వీరప్రతాప రుద్రదేవచక్రవర్తి

### (1295—1324)

ముమ్మడాంబకు మహాదేవ ♦ భూపునకును
బుత్రుఁడయ్యె రుద్రమదేవి ♦ పౌత్రుఁడగుట
నామహారాణి పరలోక మందఁజక్ర
వర్తియైసల్పె రాజ్యంబు ♦ పాలనంబు. ౧

సీ. సింహాచలముదాక ♦ సీమలుత్తరమున
నేకఛత్రంబుగ ♦ నేలినాఁడు
కాంచీపురముదాక ♦ కటకము వరకును
మించినకీర్తిఁ బా ♦ లించినాఁడు
తూర్పుసంద్రము మేర ♦ నేర్పుతో నేలుచు

విఫణివీథుల గార ♦ వించినాఁడు
శాత్రవవీరుల ♦ సమయింపఁజేయుచు
నరిభయంకర నామ ♦ మందినాఁడు
గీ॥ నరవితొమ్మిది లక్షల ♦ సైన్యముంచి
బెండపూడన్నయామాత్యు ♦ వీరవర్యుఁ
దానికధిపతిగా గజా ♦ ధ్యక్షుగాఁగఁ
జేసి వీరప్రతాపుండు ♦ వాసిగాంచె. ౨

ఎల్లయ మేచయనాయకు
లల్లన సైన్యాధికారు ♦ లై పాలింపన్
ఎల్లల రక్షింపంగాఁ
గొల్లగ నేర్పాట్లొనర్చె ♦ ఁగొనియాడ ప్రజల్.
పాలమట్టియు వనమాల ♦ పాడుదామ
గట్లదూపాడు మొదలగు ♦ గ్రామములను
నందికోటుకూరు మున్నర ♦ ణ్యములగొట్టి
వాసయోగ్యంబుజేసెనీ ♦ ప్రభువరుండు ౩
విద్యానాథకవీంద్రుఁడు
హృద్యముగ రచించి యొక్క ♦ కృతినిచ్చెఁబతికిన్
విద్యావిశారదత నన
వద్యమలంకార శాస్త్ర ♦ మనిపేరొందన్. ౪
సీ॥ కందనవోల్సీమ ♦ యందుబాలింపఁగా
విడెముకొమ్మయరాజు ♦ వేడ్కనిలిపి
నందికోట్కూరులో ♦ నంబ్రసిద్ధుఁడు సిరి
సింగళమహాదేవు ♦ సీమనుంచి

గూపాడుసీమను ♦ నేపారనేలగా
శ్రీనాథసేనాని ♦ థానునిలిపి
పొత్తపినాటిని ములికినాటిసిజుట్ట
లంకగొంకారెడ్డి ♦ రాజుజేసి

గీ॥ నాడులకు సీమలకు వేరు ♦ నాథులుండ
దేశరక్షణబాధ్యతా ♦ ధీరులగుచు
దగిన యాజ్ఞలనిచ్చుచు ♦ దర్పమొప్ప
జక్రవర్తియై పాలన ♦ జక్కఁజేసె. ౬

దేశ పరదేశ బేహార్లు ♦ తిరుగుచోట్ల
వస్తురూపము రొక్కంబు ♦ బ్రభునియావ
సుంకముల బన్నులను గొన్ని ♦ సుల్కములను
నగరునకు నిచ్చుచుందురే ♦ వగయు లేక. ౭

భూరిదేవాలయములకు ♦ పొలుపుమీర
దీపదానములంజేసి ♦ తెలుగువిభులు
మండలేశ్వరులుం బ్రజల్ ♦ మహితగుణులు
గొర్ల, గోవుల, నేతిని ♦ గూర్చుచుండ్రు
భక్తిమీరఁగ సతతంబు ♦ బ్రాభవముగ. ౮

సీ॥ కాంచీపురిని మున్న ♦ గండ గోపాలుని
నిల్పి పాలనమును ♦ సల్పుచుండి
పల్నాటిసీమ దే ♦ వరినాయనింగారి
గలి వీరభద్రుని ♦ నిలిపి యేలి
వెలనాటిలో సోమ ♦ వెంకయ సాహిణి
నమరఁగాఁ బాలింప ♦ నధిపుఁజేసి

కమ్మనాడేలఁగా ◆ కామయ బొప్పనిం
గారిని మురమార ◆ గాను నిలిపి
పోతయసాహిణి ◆ బోలుపార పాకనా
డేలుచుండెడి యట్లు ◆ లేరుపరచి
ప్రజల కష్టసుఖంబుల ◆ బలువిధముల
గనుగొనుచు సల్పఁగా నధి ◆ కారములిడి
ధరణివీర ప్రతాప ◆ రుద్ర జనవిభుఁడు
సార్వభౌముఁడై రాజ్యంబు ◆ జక్క నేలె. ౯

కేరళాధీశ రవివర్మ ◆ వీరుఁడగుచు
సాయపడరాగ దానికి ◆ సంతసిలుచు
బంచపాండ్యులు మొదనని ◆ బాహుబలము
నెంచి కాంచీనగర మాత్ర ◆ మించినంత
ముప్పసేనాని దాచ చ ◆ మూపతులను
బంపివారల నిర్జించె ◆ బ్రభ వెలుంగ. ౧౦
పంచపాండ్య దళవిభాల ◆ బిరుదమిచ్చి
కంచిద్వారచూర ◆ కారులనుచు
గారవించి వారి ◆ క్రమ్మఱ కంచిలో
మన్మగండు నిలిపి ◆ మహిని యేలె. ౧౧

సీ. ఏనాడు వీక్షింప ◆ నీనృపాలాగ్రణి
దేవాలయంబులే ◆ తేజరిల్లు
ఏసీమఁదలఁచిన ◆ నీ నరపతి బ్రాహ్మ
ణాగ్రహారంబులే ◆ యతిశయిల్లు

ఏవీడు గాంచిన ♦ నీమహీపాలుని
ధర్మసత్రంబులే ♦ దనరుచుండు
ఏచోటు నెంచిన ♦ నీపతి ద్రవ్వించు
చెర్వులుం బావులు ♦ జెలఁగుచుండు
శిల్పచాతుర్య మెందున ♦ నల్పమయ్యె
విద్యలుం గళలన్నియు ♦ వృద్ధిఁగాంచె
వీరనాయకు లెల్లెడ ♦ వెల్లివిరియ
దేశరక్షణ కార్యాల ♦ దిరుగుచుంద్రు. ౧౨

ఎలమి త్రిపురాంత శ్రీశైల ♦ ములను భక్తి
మల్లికార్జును సేవించి ♦ క్ష్మాపతియును
భూమిదానంబు లొసఁగియుఁ ♦ బొలుపుమీఱ
శాశ్వతంబుగ బడసెను ♦ సద్యశంబు. ౧౩

బుద్ధయకు కాంచమాంబకు ♦ పుత్రుఁడైన
మారసాహిణి యాజ్ఞరా ♦ మాయణంబు
కవులు నల్వురు రచియించ ♦ గాండములను
మల్లికార్జునభట్టు కు ♦ మార రుద్ర
భాస్కరుం డయ్యలార్యులు ♦ బ్రౌఢశైలి
భాస్కరంబను పేరిట ♦ బరగనంత
సాహిణి గృతీశుఁడయ్యె య ♦ శస్వియయ్యె. ౧౪

ఆ శతాబ్దాన రుద్రభ ♦ ట్టనెడి కవియు
వల్లభామాత్యుఁడన్ కవి ♦ వరుఁడు మంచ
నాఖ్యుఁడాది ప్రసిద్ధు లీ ♦ యాంధ్రభూమి
గ్రంథరచనం బొనర్చి వి ♦ ఖ్యాతిఁ గనిరి. ౧౫

ఈ రీతిఁ జక్రవర్తి, యు
దారులునౌ మండలముల ♦ ధరణీపతులున్
గోరుచు భాషావృద్ధిని
గౌరవముగ జూచుచుండ్రు ♦ కవి పండితులన్. ౧౬

సం.గీ. ముల్కినాడేలు త్రిపురాంత ♦ భూపుఁడొకఁడు
గండికోటను దుర్గాధి ♦ కారి యంబ
దేవుఁడు స్వతంత్రులై తన్ను ♦ ధిక్కరింప
సర్వసేనాని బంపియా ♦ సాహిణులను
సంగరమ్మున శిక్షించి ♦ శాంతినిలిపె. ౧౭

భైరవుం జమడేశ్వరి ♦ భక్తి కొమరు
సామిని వీరభద్రుము ♦ సానదేవి
వీరపురుషుల నీశు మై ♦ లారుదేవుఁ
బాండవుల, నేక వీరను ♦ బరశురాము
నోరుగల్లున బూజించు ♦ వారలపుడు. ౧౮

రత్నగర్భ యటంచును ♦ రాణకెక్క
నాంధ్రరాజ్యాతిశయమునం ♦ దందు దెలిసి
ఖిల్జిసుల్తాను దీనిని ♦ కొల్లగొనఁగ
సతత మాలోచనంబుల ♦ సల్పఁదొడఁగె. ౧౯

మొదట పదమూఁడువందల ♦ మూఁడు క్రీస్తు
శకమునందు అలావుదీన్ ♦ చక్రవర్తి
యోరుగల్లు జయింపఁగాఁ ♦ బేరువడ్డ
మల్లికాఫరు నంపెను ♦ మత్సరమున. ౨౦

అంత గోదావరీప్రాంత ♦ మందు గల్గె
ఘోరరణమొండు దానిలో ♦ బారిపోయె
మల్లికాఫరు రుద్రభూ ♦ వల్లభు ఘన
సైనికపరాక్రమమునకు ♦ జాలలేక. ౨౧

ముష్కర తురుష్కసేనాని ♦ మూడునాలు
గేండ్లు దాటించి మఱల దం ♦ డెత్తి వచ్చి
లక్షకాల్బల మశ్వద ♦ ళంబు గొనుచు
నాంధ్రవీరశిఖామణు ♦ లపుడుగూడ
తీవ్రముగ నెదిరించఁగాఁ ♦ దిరిగిపోయె. ౨౨

అంత మరికొన్నినాళ్ల కా ♦ యంతకుండు
ముందు సర్బరదుర్గంబు ♦ ముట్టడించి
వాణిశివిదేవు భటు లగ్ని ♦ పాలుగాగ
జేసి యా దుర్గముంగొనె ♦ చింతలేక. ౨౩

ఓరుగంటికోట ♦ కురికి శాత్రవులంత
పెక్కునాళ్లు పోరి ♦ భీకరముగ
బట్టుకొనిరి కోట ♦ భటుల కోర్కెనెఱింగి
లోబడంగజొచ్చె ♦ రుద్రవిభుఁడు. ౨౪

వేయి యొంటెలు మోసిన ♦ వివిధరత్న
రాసులం ధనరాసులు ♦ వేసుకొనుచు
మల్లికాఫరు ఢిల్లికి ♦ మఱలిపోయె
కప్పమేటేట గట్టుకీ ♦ గా నొసర్చి. ౨౫

అంత గొన్నేళ్లు జరుగఁగా ♦ నలుపుఖాను
ఢిల్లి సుల్తాను సేనాని ♦ కొల్లగొనఁగ

మఱల నేతెంచి దుర్గంబు ♦ ముదముడంప
సేనలం బురికొల్పి తా♦మానధనులు
శౌర్య సాహసు లాంధ్రులు ♦ జక్కడంచిరి
సైన్యములను హతాశులై ♦ సాగిపోవ. ౨౬

కప్పముం గట్టడి లేమను♦కారణమున
మరల సైన్యాధికములతో♦దరలివచ్చి
ప్రళయభీకర రణరంగ♦వహ్నిదార్చి
ముష్కర తురుష్కులెల్లరు♦మోహరింప. ౨౭

ఆ భయంకర యుద్ధము ♦ నందు నాంధ్రు
లెందరో ఘోరముగఁబోరి ♦ మ్రందినారు
కమ్మవెల్మ నృపాలురు ♦ గ్రముగఁబోర
రెడ్డివీరులు కొండఱు ♦ రాకనిలుప. ౨౮

ప్రళయకాల రుద్రుండన♦ బ్రతిభవడసి
ముష్కర తురుష్కదాడుల♦మోహరించి
తరిమివైచియు కాలంబు♦తప్పినడుప
దాని నెదురీద లేకుండె♦ధరణివిభుఁడు. ౨౯

అలుపుఖాన్ సైన్యములకును♦గెలుపుగల్గు
చుండ రెడ్లను జనుదెంచి ♦ చెండిరపుడు
గాని సమయంబుదప్పి సం ♦ గరమునందు
తురకసైన్యాలకు జయంబు♦వరలుకతన
నాంధ్రరాజ్య మహాలక్ష్మి ♦ యంతరించె. 30

అలుపుఖానంత యుత్సాహ♦మతిశయిల్ల
బందిగా జేసి వీరనృ♦పాలవరుని

దోడుకొని ఢిల్లికిం బోవ ♦ త్రోవలోన
యాత్మహత్యచే మరణించె ♦ నంద్రు చింత
యోరుగల్లంత సుల్తాను ♦ పూరునయ్యె. ౩౦
జైన గురువుల హింసించి ♦ శైవభక్తి
వారి మడిమాన్యముల వశ ♦ పఱచుకొనిన
నుత్కళేంద్ర దురుష్కుల ♦ యొద్దజేరి
జైనులీరాష్ట్రినాశంబు ♦ సల్పెనంద్రు. ౩౨
కమ్మరాష్ట్రంబు వేంగి ♦ దేశమ్ములంత
నచట సేనాని ప్రోలవే ♦ మాఖ్యరెడ్డి
పాలనంబుననుండ ♦ నాపాపతురక
నివహము లెదిర్చియుం బారె ♦ నిలువలేక. 33

చాగికులుండు మంత్రి గణ
సత్తమ నీతి యుగంధరాఖ్యుఁడౌ
నాగయగన్న మంత్రి జన
నాథునితోడనె ఖైదియయ్యె నిం
కేగతి గానలేక తన
హిందుమతంబు త్యజించి ముస్లిమై
తోగఁదురుష్క భూపతియు
నిచ్చెను వానికి బాలకత్వమున్.

తమి మార్కండేయ పురా
ణమునుం దెలుగించి మారన ♦ కవీంద్రుండున్
సుమహితుఁడు గన్న మంత్రికి
నమర సమర్పించె కృతిని ♦ యాదరమొప్పన్.

రూప గుణ వైభవంబుల ♦ నేపుమీరి
వారకాంతామణులఁ గడు ♦ వాసిఁగాంచి
సాధ్వి మాచలదేవి యా ♦ సార్వభౌము
భోగకాంతగ బేరొంది ♦ భూరిదాన
ధర్మముల సల్పి విఖ్యాతి ♦ దనరెనపుడు.
కాకతీయాంధ్రరాజ్యంబు ♦ కలిమిబలిమి
శతములుగ మూడు వృద్ధిగా ♦ సాగిపోయె
నాంధ్ర జనతతి కష్టము ♦ లనుభవింపఁ
దురకపాలన దర్వాత ♦ తొంగలించె.
ఓరుగల్లు కోట ♦ నుండిన నగరము
బాహ్య జనపదములు ♦ బాడువడియె
నేడు చిన్నపల్లె ♦ నిలచియున్నది దాన
శిథిల చిహ్నములు వి ♦ శేషమున్న.

అవశేషము (1324—1369)

—:o:—

## ముసునూరి రాజులు - ప్రోలయ్య, కాపయనాయకులు

తురక దురంతముల్ పెరిగె
మప్పరిపాలన సాగె నాంధ్రలో
కరుణ యొకింత జూపకయె
కాఫరులంచును బ్రాహ్మణాదులన్
బరివరి హింస సేయుచును

భామినులఁ జెరబట్టుచుండి దు
ర్భరముగ నెల్లమానవుల
బాధలు వెట్టుచునుండి రత్తరిన్. ౧

మతములో జేరకున్నచో ♦ మత్సరమున
బ్రాహ్మణుల నగ్నిలోబడ ♦ వైచుచుండి
దేవతా విగ్రహంబులఁ ♦ దెగనరకుచు
ధ్వంసమొనరించి రాలయ ♦ వనములాది. ౨

పాపఫలమందెను దురుష్క ♦ ప్రభువనంగ
దురకభూపతి గాసుదీన్ ♦ తుగ్లకంత
ఢిల్లిలో మరణించఁగా ♦ నెల్లచోట్ల
నాంధ్రభూమిని సంతోష ♦ మతిశయిల్లె. ౩

కాకతీయ చమూపతుల్ ♦ గలయబలుకు
కొంచు మరల విజృంభించి ♦ కూడగట్టి
సైన్యముల నెల్ల తమలోన ♦ సాహసుండు
ప్రోలనాయ నాధ్వర్యత ♦ బోరిరపుడు. ౪

ముసునూరన్వయ దీపకుండు ఘనుఁడున్
బ్రోలాభిధానుండు దు
ర్వ్యసనాక్రాంత తురుష్క సైన్యతతులన్
బాహాబల ప్రజ్ఞచే
నసమానస్థితి యుద్ధరంగములలో
నందందు నిర్జించుచున్
వెసనవ్వారల బారఁద్రోలి విభుఁడై
వెల్గొందె నోర్గల్లునన్. ౫

ఏకసలి రాజధానిగా ♦ వీకనేలి
సోదరుఁడు కాపభూఖ్యుఁడు ♦ మోదమొప్ప
సాయమొనరింప వాఙ్నవి ♦ స్తరణజేసి
యాంధ్రజన చక్రవర్తిగా ♦ నతిశయిల్లె. ౬
నిలప పేరిటి యూరెచ్చి ♦ విప్రజనుల
కగ్రహారంబుగా ఖ్యాతి ♦ నందె నితఁడు
ప్రాత నల్లిల్లులుం బూర్వ ♦ రీతినిలిపె
గురజగ్రామంబు బ్రాహ్మణ ♦ వటులకిచ్చి
కాపయ యశస్వియయ్యె ♦ నక్కాలమునను. ౭
తూర్పునాటి కమ్మకులాబ్ధి ♦ తోయజారి
ప్రోలభూపతియుఁ దాటి ♦ పోయినంత
కాపయయు జక్రవర్తియై ♦ ఖ్యాతిగాంచె
వీరు నలుబదిరెండేండ్లు ♦ విశ్రుతముగ
దేశపాలనజేసిరి ♦ తేజమొప్ప. ౮
బహమనీరాజ లావుదీన్ ♦ ప్రబలుఁడగుచు
నింతలో నెదురించి దు ♦ ర్దాంత రణము
లెన్నొసల్పుచు గాపయ ♦ నెట్లొవంచి
కప్పముల గానుకలను దు♦ర్గముల గొనియె. ౯
బహమనిరాజ లావుదిను
ప్రాభవు ఢిల్లినవాబునోర్చి ప్రబ
త్యహమును గాపనాయకును
దారసపడ [illegible] తా [illegible]
నహమున బల్ కృతఘ్ను [illegible]
యాతని తోడనెదిర్చి యుద్ధని

ర్వహణ సమర్థతాంగ గజ
రాజ మఃలాదిగబొందెఁ గాన్కలక్ ౧౦

ఆయలావు దీనుఁ ♦ డంత రించినగూడ
తప్పదయ్యె రణము ♦ ధాత్రిపునకు
బహమనీల మేటి ♦ బహాదరుసేనాని
మరల మరల వచ్చి ♦ మార్కొనంగ. ౧౧

గోలుకొండ కోట ♦ గొనియు వైభూత్యసిం
హాసనం బొకండు ♦ నందుకొనియు
దృప్తిజెందె బహమ ♦ నీరాజు చివరకు
గాపనృపతి రాజ్య ♦ కాంక్షవదలి ౧౨

వెలమయన పోతవిభుఁడంత ♦ వెడలితురక
ప్రభులలోజేరి సాగించి ♦ రణములందు
భూరివిక్రమ సాహస ♦ పుడమినేత
భీమపురిజంపెఁ ద్వేషంబు ♦ పెంచి మించి. ౧౩

ఆ యుద్ధరంగములను వి
నాయకదేవుండు కాప ♦ నాయక తనయుం
డాయత సాహస విక్రమ
భూయిష్టుండయ్యెనందు ♦ బొలిసెగవీంద్రా ! ౧౪

ఈ రీతి దెలంగాణము
భూరమయుంతక్ దురుష్క ♦ భూపతి జేరెక్
[illegible]
వీరవధు [illegible] ♦ వీకనొనర్పక్. ౧౫